6) సృష్టిలో ముగ్గురు సాక్షులు వేద ఉపనిషత్తుల అర్థమును తెలిసిన ఋషులు. రాగమును నశింపజేసిన పరమహంసలు, బ్రహ్మచర్య దీక్షలో నున్న సనకాది మునీశ్వరులు శ్రీ శబరిమాతాజిగారు.

7) అనన్య మనగ బ్రహ్మము కంటే ఇక ఏదిలేదని భావన కలిగియుండునో దానినే అనన్యమనబడును.

8) జీవుడు ఈశ్వరుడు కార్యోపాది బ్రహ్మచైతన్యము జీవుడని, కారణోపాది బ్రహ్మచైతన్యమే ఈశ్వరుడని ఉపాది ద్వయములు కడగ త్రోసిన బ్రహ్మము మిగులును. ఈ బ్రహ్మము ఆత్మసాధనలేనివారికి అతిదూరముగా, ఆత్మజ్ఞానము కలిగిన వారికి అతి దగ్గరగ అగుపడును.

9) మనస్సు, బుద్ధి, ఇంద్రియం వికారములు, సుఖదుఃఖములు, సత్వరజోతమగుణములు ప్రకృతి వలన పుట్టినవి.

మాయ కార్యకారణములను కలుగజేయుటకు హేతువు, మాయ, ప్రకృతి, త్రిగుణముల ఆసక్తిచే, ఉచ్చ, నీచ, జన్మలకు కారణమగుచున్నది.

10) దేహములయందు పరమాత్ముడు సాక్షిగా, చూచువాడును, అనుమోదించువాడును, భరించువాడును, అనుభవించువాడును. నియామకుడైయున్నాడు. జీవాత్మ పరమాత్మ భేదము లేదని తెలుసుకొన్న జ్ఞానులు ముక్తులు.

11) తనలో నున్న పరమాత్ముని శుద్ధమనసుచేత ధ్యానము చేత కొందరు సాంఖ్యయోగముచేత కొందరు కర్మయోగము చేత కొందరు చూచుచున్నారు. ఈ పద్ధతులలో చూడలేనివారు, గురువుల జ్ఞానోపదేశము చేత చూడవచ్చును. ఎల్లప్పుడు నానాభూత ప్రపంచమంతయు ఒక్క దానిలో ఉన్నదని, ఆత్మ వలన కల్పింపబడునట్లు చూచి తెసులుకొనుచున్నారో వారు - పరబ్రహ్మ స్వరూపమును పొందుచున్నారు.

12) సత్వగుణలక్షణములు ధర్మంపై నమ్మిక, నిర్మలమైనది, ప్రకాశించునది. ఆరోగ్యకరమైనది. దయ, శాంతి, భగవత్ చింతనలో మనసు లగ్నముండునది. రజోతమో గుణలక్షణము ఆశాపాశములందను రాగమును, విషయ సుఖములపై ఆసక్తి కలుగుట. నామము కొరకు భగవత్ కార్యములు చేయుటము. గుణ లక్షణములు మంచి, చెడు తెలుపనిది. అజ్ఞానము,

మోహము, భయము, గర్వము, నిద్ర, భ్రమ, సోమరితనము, అతి నిద్ర, అతి తిండి పై అపేక్ష కలిగియుండడము. భగవంతుడే లేదని భావన కలిగియుండడము.

13) విషయవాసనలు నశించినప్పుడు మనసు అంతర్ ముఖమై తిరుగును. ఈ స్థితిని ఊర్ధ్వకుండలమని అధోకుండలమని, ఆవరణ రహితమని అంటారు.

14) సకల దోషములకు మూలము కామ, క్రోధ, లోభములు మూడును, నరకమునకు హేతువులు.

15) దేవ, గురు, జ్ఞానుల, సత్పురుషుల సత్కరించి, పూజించుటచేత శరీర, శుద్ధము, సత్యము, దయ, భూతదయ, నిత్యసంతోషముచేత హృదయశుద్ధియు. బ్రహ్మచర్యదీక్ష కలిగి ఏ ప్రాణులను కూడ హింసించక యుండునది. శరీరముచే, చేయు తపస్సని ఋషులు చెప్పిరి.

16) అధిష్ఠానమనగా - శరీరము, కర్త యనగ ఉపాధితో కూడిన జీవుడు.

కరణమనగా - జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనసు, బుద్ధి.

చేష్టయనగా - పై 12 ఇంద్రియముల వ్యాపారములు (చేసే పనులు)

దైవమనగా - అదృష్టము పుణ్యపాపములు, ఇంద్రియ అధిష్ఠాన దేవతలు, మనుజుడు శరీరముచే, వాక్కుచే, మనస్సుచే, చేయబడు మంచి కర్మలకు, చెడుకర్మలకు పై 5 అధిష్ఠానములే కారణములు.

17) ఉపాధి యనగ - విశిష్ట ధర్మము లేదా సంబంధము

వాచక్ యనగ - ప్రతిపాదింపబడు విషయము - అనగా వాచ్యమే రూపమని

వాచర్ అనగ - ప్రతిపాదన చేయువాడు అనగా నామమని

కార్య అనగ - మహాతత్వము, అహంకారము

సాధన మనగ - మఖయాగ, పూజ, ధ్యానములు సత్కర్మలు

అవ్యాకృత మనగ - అవ్యక్తమని, స్పష్టంగ తెలుసుకోలేని మూల ప్రకృతి. అవిద్య, యోగమాయశక్తి, మాయ, సంసృతి, బంధము అని అంటారు.

మహతత్వమనగ బుద్ధి, సృష్టి ఉత్పత్తి చేయునది. దీని ద్వార సూత్ర అహంకారము పుట్టినది. దీని వలననే సర్వకార్యలింగ దేహము లేర్పడెను. లింగదేహములకే జన్మమరణములు.

18) సృష్టిలో చిరంజీవులు అశ్వద్ధామ, బలి, వేదవ్యాసులు, నారద మహాముని, హనుమంతుడు, విభీషణుడు, కృపాచార్యులు, పరుసురాముడు.

నవవిధ భక్తి - శ్రవణం, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చన, అనందము, దాస్యము, సాఖ్యము, ఆత్మనివేదనము

గర్భములో ఉన్నప్పుడు శిశువు సోహం సోహం నేనే

బ్రహ్మయని, యనును, బయట పడగానే పూర్వస్మరణ మరచిపోయి కోహం కోహం నేనేవడను నేనేవడను అని అనును. ఈ విధంగా జీవుడు మాయలో చిక్కుకొనును.

అష్టగాయకులు (దేవ) గరుడ, గంధర్వ, విద్యాధర, యక్ష, కిన్నెర, కింపురుష, నారద, తుంబురలు.

సంగీత జ్ఞానము రాగ, తాళ, నృత్య, వాద్య జ్ఞానములు

పృధ్వి వైశాల్యము 56 కోట్ల యోజనములు

దేహములు, పంచతత్వములతో కలసిపోయినప్పుడు నేను అనునది ఎక్కడ మిగిలియుండును.

బ్రహ్మము, మాయ (అను రెండే రెండులో నేను దొంగ వచ్చినది ఇది ఎక్కడ నుండి వచ్చె?)

అష్టాంగ యోగము యమ, నియమ, ఆసన, ప్రాణమయ, ప్రత్యాహార, ధారణ, ధ్యానము, సమాధి, స్థితి, మో॥.

ప్రజ్ఞానం బ్రహ్మ, అహంబ్రహ్మాస్మి తత్వమసి, అయమాత్మబ్రహ్మ, 4 మహావాక్యములు. ఋగ్వేద, యజుర్వేద, సామవేదము, అధర్వణ వేదములలోనివి.

# స్వయం ప్రకాశ అవినాశి అమృత రూప పరమాత్మ

## గ్రంథ పరిచయము

అతిసనాతనమైన, అద్భుతమైన, బ్రహ్మాండమైన, సత్యమైన నిర్వికార, నిర్వేశ్వరుడై, నిరామయుడై, నిర్బంధియై, విదేహియై, చావు పుట్టుకలు లేనివాడై యున్నాడు పరమాత్ముడు. బాల్య, కూమార, యౌవ్వన, వార్ధక్యావస్థలు లేని వాడై ఏకమై విశ్వవిశాలమై, బ్రహ్మమై, స్వయం ప్రకాశమై అమృతరూప పరమాత్మ బ్రహ్మానంద రూపములో ఉన్న పరమాత్ముని అన్యోన్య శక్తిచేత జ్ఞానమును పొంది జ్ఞానము వలన తేరుకొని, ఆత్మదర్శనం హర్షించి, అనుభవముతో పొందడము.

అనగా, ఉదా॥ ఒక అపూర్వ బంగారు బిందె ఉన్నదని తెలుసుకోవడము హర్షమని అంటారు దానిని చూడడము. మోదమని అంటారు. దాని ఫలము పూర్తిగా అనుభవించడము ప్రమోదమని అంటారు.

ఈ ఆనందమే తన్మయానందమని కేవలానందమని ఆత్మదర్శమని బ్రహ్మానందమని అంటారు. అండజ, జరాయుజ, స్వేదజ, ఉద్భిజ 84 లక్షల జీవరాశులలో మానవజన్మ అత్యుత్తమమైనది. మానవులు తమ తమ అనంత కోటి జన్మల గుణదోషములచే కర్మలు చేయుదురు. కర్మసంస్కారముచే ఉచ్ఛనీచ జన్మలు ఎన్నో ఎత్తుచుందురు. ప్రతి ప్రాణ కోటి పుట్టడము, పెరగడము, చావడము ఇది ప్రకృతి ధర్మము. బ్రహ్మ శాసనము ఇది సహజము తప్పదు. జన్మదుర్మరణముల భవసంసార నరకయాతనను దాటుటకు స్వయంప్రకాశ అవినాశీ అమృత రూపమనే ప్రవచనమును చదివి తెలుసుకొని జ్ఞానమును వశింపజేసి జ్ఞానముచేత పరమోన్నత పద, నిరతిశయమైన, పరమ పదమును పొందుము. పరమ పదమే చావు పుట్టుకలు లేని జన్మరాహిత్యము. జన్మరాహిత్యమే, పరమ పదమోక్షము. పరమ పదమే వేదాంతము. వేదాంతమే సద్గురు దివ్యమంత్రము అని అంటారు. గురుమంత్రమే, అజ్ఞాన చీకటిని తరిమి తొలగింపజేసి జ్ఞానస్వరూప స్వయం తేజమును చూడడము. మృత్యువు నుండి అమృతత్వము పొందడము శాస్త్ర జ్ఞానముచేతగాని దివ్య పురుష బోధలచేగాని, శ్రీ సద్గురు యొక్క దివ్య బోధనలచేగాని, జ్ఞానమును పొంది జన్మతరించుకొనవలెను.

మహాయజ్ఞయాగాది కర్మలచేతగాని, ఘోరజప తపాది యోగములచే గాని, వేదశాస్త్ర పఠనముచేత గాని, దాన, ధర్మాది సత్కర్మలచేతగాని పొందలేని దివ్య పరమాత్ముని కేవలము నిర్మల హృదయములో నిశ్చల మనసుచే ఇంద్రియనిగ్రహ కలిగి, ధృఢ బుద్ధిచే, స్థిరచిత్తముతో అనన్య భక్తిప్రేమచేతనే దివ్యపరమాత్మ దర్శనము పొందగలము. అతి తొందరగా పొందబడును. శాస్త్ర విధిలో సత్కర్మలెన్ని చేసిన ఆయా దేవతల ఆరాధించి పూజించుటయే, ఆయా దేవతల అనుగ్రహము పొందుదుము. దేవతానుగ్రహముతో స్వర్గసుఖములు పొందగలము. ఆ సుఖములన్నీ తుచ్ఛ సుఖములు, శాశ్వతములు కావు. అశాశ్వతములు కోట్ల డబ్బు కూడబెట్టుటకు కూడా సుఖము కాదు. యౌవ్వన సుందర స్త్రీ, పురుష సంభోగజలములు, సుఖము కాదు విషయ సుఖములు విషముతో సమానము. అవినాశీ అమృత సుఖమే శాశ్వతమైనది. సత్యమైనది. నిత్యమైనది.

కావున మనము అశాశ్వత విషయ సుఖములను త్యజించి శాశ్వతమైన అమృత సుఖమునే పొందవలయును. ఈ స్వయం ప్రకాష అవినాశ అమృతరూప ప్రవచనమును చదివి, విని, జ్ఞానమును పొంది తరించండి. విశ్వ మానవ కోటి యోగ క్షేమమునకు, మానవులకు సంసార సముద్రం దాటించు ఉత్తమమైన నౌక లాంటిది.

# స్వయం ప్రకాశ అమృతరూపుడు - పరమాత్మ

## ప్రారంభములు

హే! శ్రోతలారా ఈ అమూల్యమైన మహా వాక్యములను ఎన్నడు మరవకండి. చదివి, జ్ఞానమును పొంది, తరించండి -

పరిత్రాణాయ సాధూనాం - వినాశాయ చదుష్కృతాంః
ధర్మసంస్థాపనార్థాయ - సంభవామి యుగే - యుగేః

జగత్ గురువు శ్రీ కృష్ణ పరమాత్మ అంటాడు - సాధు సజ్జన, సత్ పురుషుల మనస్సుకు దుఃఖము కల్గించి, బాధించు దుర్మార్గ దుర్జనులను దండించి, సాధు సత్ పురుషుల సంరక్షణకై మరియు ధర్మము నశించు వేళ, అధర్మవృద్ధి, జరుగునప్పుడు ధర్మస్థాపనకై ప్రతి యుగములో భగవంతుడు, స్వయముగా లేదా భగవత్ ఆజ్ఞానుసారము దివ్యపురుషులు ఈ ధరణిపై లోక కళ్యాణార్థమై జన్మమెత్తుచుందురు.

కాని సాధు సత్ పురుషులు, మహాత్ములు, మహనీయులు, యోగుల సదా ఆలోచన మరియు త్యాగ బుద్ధి పూర్ణశాంత మనస్సు, నిండు ప్రేమ, సమదృష్టి భావముతో, ఆకాశము వలె విశాలము, నిర్మల హృదయము, చిత్తశుద్ధి కలిగి ఉంటారు. మీరు అందించు అమూల్యమైన, శాశ్వత రత్నములు ఎవ్వరు ఎన్నడు దోయలేని తరగని ధనసంపద కలిగియున్నది. త్యాగులు, యోగ్యులు, జ్ఞానులు అఖండ దానకర్త, అనన్య భక్త శిరోమణి, సచ్చితానంద, కేవలానంద, నిత్యానందమూర్తులు పరమహంస, శ్రీ శబరిమాతాజీగారు, దుర్మార్గ, దుష్టజనుల ప్రేమ, ఆప్యాయతో కమ్మని పలుకులతో వారిని తన సన్నిధిలో చేర్చుకొని తన దివ్య సందేశములతో వారిని తీర్చిదిద్ది, మానసికంగా వారి మనస్సులోని బుద్ధిలోని రజో, తమో చెడు గుణములను దుర్గుణములను రూపుమాపి జ్ఞానోదయము కల్గించి, సజ్జన, సన్మార్గులుగ తయారుచేసిన మహా (తపస్విని) కలియుగ అవతారులు పుణ్యమూర్తులు, శ్రేష్ఠజ్ఞులు దీని భావమిదిరదా. పూర్వము గత మూడు యుగములలో భగవంతుడు ఎన్నో అవతారములెత్తి, కిరాతక, దుర్మార్గ, దుష్టులను, ఘోర రాక్షసులను దండించి హతమార్చినాడే కాని, ఎన్నడు ఎప్పుడైన, ఏకాలములోనైన వారిలోని దుష్ట, దుర్మార్గ, కిరాతక, రజో, తమో గుణములను విడగొట్టి, నశింపజేసి, వారిని సంరక్షించి, సజ్జన, సన్మార్గులుగ చేయలేదు. ఈ ప్రసక్తి ఎక్కడ, ఎప్పుడు జరుగలేదు.

కాబట్టి సాక్షాత్ భగవంతుడు మహాసత్తా పురుషుడు చేయలేని అసాధ్య, అసంభవ, అసాధారణ, అద్భుత కృత్యములు, సాధుసంతులు, మహాత్ములు పరమభక్తులు, మహాయోగులు అతి సులభముగా కార్యములను సాధించి, చేసి, చూయించగలరు. అటువంటి సాధువు ఋషులలో, శ్రీ శబరిమాతాజీ కోటిలో ఒక్కరు. వారికి నా అనంత కోటి నమస్కారములు, పృథ్విని తరింపజేయు దివ్యపురుషులు సచ్చితానంద మూర్తులు పరమహంస శబరిమాతాజీగారు శ్రేష్ఠజ్ఞులు. నేటికిని అమరులై నిత్యము భక్తజనకోటికి జీవ సమాధి నుండి దర్శనమిచ్చుచున్నారు.

# స్వయం ప్రకాశ, అవినాశీ అమృత రూపుడు

హే భక్తజన బాంధవులారా!!

పూర్వము పరమ శివుడు పార్వతీదేవికి బోధించిన పరమ రహస్యమైన, అపూర్వమైన, ఆత్మపరమాత్మ తత్త్వము.

మరియు శ్రీరామచంద్ర ప్రభు తన అంతరంగ భక్తులకు శ్రీ లక్ష్మణునకు, భక్తమారుతికి బోధించిన అమృత రసభరిత బ్రహ్మజ్ఞానము మరియు శ్రీ కృష్ణపరమాత్మా భక్త ఉద్ధవునికి, పార్థునకు ఉపదేశించిన, అతిగోప్యమైన, అవినాశితత్వము, పరమ రహస్య జ్ఞానోపదేశము భక్తజనులకు వినిపించు అమృతరసభరిత దివ్యసందేసము, శ్రద్ధ, భక్తితో, ఏకాగ్రతతో వినగలరు. ఈ ప్రవచనము వేదాంతసారము. రహస్యములలో పరమ రహస్యమైనది. త్రిభువనములలో విశిష్టమైనది. పరమపావనమైనది. మన అనంతకోటి జన్మల, పాపరాశిని భస్మముచేసి, జన్మపునీతము చేయునది. చావు, పుట్టుకలు లేనిది. కని, విని తరించండి. మనస్సుకు పూర్ణానందము కల్గించునది. హృదయానంద భరితము చిత్తము, స్థిరము చేయునది. శ్రవణానంద, బ్రహ్మనంద, సుధారసమయ, సందేశము, చాల భక్తి, శ్రద్ధలతో వినండి.

ఛత్రపతి శ్రీ రాజారామ చంద్రప్రభు దివ్యస్వరూపుడు. మహోత్తరమైన, సర్వవ్యాపకమై యున్న, సర్వంలో నిండియున్న వాడై (మాయకు అంటిలేక) మాయతో ఏ సంబంధము లేనివాడై, ఆది మధ్య అంతములేని అనాదిరూపుడు, అనంతరూపుడు.

కేవలానంద రూపుడు. వేదవేద్యుడు. పురాణ పురుషుడు, పురుషోత్తముడు. శ్రీరామ చంద్రప్రభు కేవలము తన అద్భుత యోగమాయ శక్తిచేత, సమస్త విశ్వమును పట్టి ధరించి, ఆకాశములోన, బయట అంతట నిండియుండి, సర్వములో వ్యాపించి యుండి గుప్తములో తన మాయచేత సృజింపబడిన జగము వైపు చూచుచుండును. అయస్కాంతమును, ఇనుమును చలింపజేయు విధముగా అనంత కోటి బ్రహ్మండములను తన చుట్టూ త్రిప్పుచుండును. సూర్యుడున్న చోట చీకటిలేనటుల, నిర్మల ప్రత్యక్ష బ్రహ్మజ్ఞాన రూప, పరమ సమర్థ పరమాత్మా సన్నిధిలో అజ్ఞానమిక లేదు. సృష్టియందు జీవకోట్లకు పరమాత్ముడు కర్తృత్వమును ఎన్నడు సృజింపడు. కర్మలను, సృజింపడు. కర్మఫలముతో కూడ ఏ సంబంధము లేదు.

ప్రకృతి సంబంధము వలన ప్రాణులు అనేక జన్మల గుణదోషములచే కర్మలు చేయుదురు. వారి వారి జన్మాంతర కర్మ, సంస్కారములచే తిరుగు అజ్ఞాని జనులు తమ మాయ, సంసారములో పడిపోయి, అజ్ఞానముచే విషయ సుఖముల వలలో పడి, కామ, రాగ, మోహ, క్రోధ, ద్వేష, మద, మాత్సర్య, ఈర్ష్య, అసూయ, లోభములో మునిగి, ఇంద్రియములు శరీర స్థానములో ఉండి తన అంతః కరణము అనగా (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) తో చేసిన కర్మలు ఆత్మపై పడుట వలన అజ్ఞాన జనులు, మోహము చెందెదరు.

అందుకని శుద్ధమైన, జ్ఞానమయ, నిరామయము తనలో నున్న పరిపూర్ణ రామున్ని చూడలేకున్నారు. పరమాత్ముడు మాయ యొక్క కేవల సాక్షమాత్రుడు. పరమాత్ముడు ఎవ్వని పాప పుణ్యములను గ్రహించడు.

పరమాత్ముడు అనంత కోటి దివ్యశంఖముల శక్తి సంపన్నుడు. అనంత బ్రహ్మాండములు అణురూపములో తనలో కలిగియున్న అఖిలేశ్వరుడు, సనాతనుడు. స్వయం ప్రకాశుడు, విశ్వవిజయుడు. విశ్వవిరాట పురుషుడై తన స్థూలదేహము రూపములో ఉంటాడు. విశ్వ బలాఢ్యుడు. అవినాశి అమృతరూపుడు. ఎలాంటి మలినము లేని నిర్మలుడు. సంకల్ప, వికల్పములు లేని నిర్వికల్పుడు. మాయలో లేని నిరామయుడు. దోషరహితుడు. ఆనందమే, ధనము కలవాడు. సచ్చిదానంద స్వరూపి. సదానంద భోగి, ద్వైత, భావన లేక ఉపాధి భేదములు లేనివాడు. ధర్మములు, గుణములు లేనివాడు. చావు, పుట్టుకలు లేని శాశ్వత అమరుడు. తన దివ్యశక్తిచేత అంతట నిండియుండి ఇంద్రియముల కగోచరుడు. తెలుసుకొనుట దశర్యుడు. పూర్ణకాంతి రూపుడు. సర్వప్రేరకుడు. పాపరహితుడు, శుద్ధచైతన్య స్వరూప స్వయం ప్రకాశుడు. సమస్త భూతకోటిలో సమదృష్టిలో ఉంటాడు. జ్ఞాన అంధకార మాయ ఆవరణలో ఉన్నవారికి తెలియదు.

కావున దేవ, గురు జ్ఞానులను సత్కరించి పూజించుటచేత, శరీర శుద్ధి కలుగును. సత్యము, దయ, సంతోషము, త్యాగము చేత హృదయశుద్ధి కలుగును. పరుల మనస్సు నొప్పించక, బ్రహ్మచర్య దీక్ష కలిగి శరీర తపస్సు పెంచుకొనవలెను. శాస్త్ర విధితో నిష్కామనతో, సత్కర్మలు, భక్తి, ప్రేమతో ఆచరించి మనము, విధి, ధ్యానలతో అంతఃకరణ శుద్ధి చేసుకొనవలెను. అంతఃకరణము నిర్మలమైనచో భగవత్ భక్తి పెరుగును. అనన్య భక్తిచేత చిత్తము, మనస్సు, స్థిరమై, బుద్ధి ధృఢమై, జ్ఞానము రవి వలె ప్రకాశించును. జ్ఞానము వలన ఆత్మ యొక్క మాయ ఆవరణ తొలగిపోవును. మాయ ఆవరణ నివృత్తి అయిన వెంటనే తన్మయానంద భంగిమలో హృదయ స్పందన కలిగి ఆనందభాష్పములు రాలును. ఆ స్థితిలో ఆత్మానందంలో ఆత్మ దర్శనము కలుగును. ఈ ఆనంద బాష్పములు సహస్రారము నుండి వచ్చును. దుఃఖములో వచ్చే కన్నీటి ధారలు మూత్రస్థానము నుండు వచ్చును. ఎంత చిత్రము (భగవన్ మహిమ ఆత్మదర్శనమైన వెంటనే మన పూపా నాళమునకు అంటికొని యున్న అనేక జన్మల సంచిత ప్రారంభములు భస్మీ పటలమగును. అందుకని మహాయోగులకు, దివ్యపురుషులకు, జ్ఞానులకు అనన్య భక్తులకు, శుద్ధ చైతన్యరూప ఆత్మదర్శనము స్పష్టంగా గోచరించును.

ఏద్వైత భ్రాంతి కలదో అది కేవలము భ్రమ. భ్రమయే మాయ. ఈ మహాశక్తి శాలి. మహా బలమైన మాయలోనే సమస్త లోకములు , బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు, ఇంద్రాది జరకోటి దేవతలు, గంధర్వ యక్ష, కిన్నెర కింపురుషులు. మానవ, దానవ, పశుపక్ష్యాది క్రిమికీటకాది సర్వభూతకోటి ఈ మాయజాలంలోనే చిక్కియున్నారు. కాని ఇట్టి మాయకు చిక్కి అంటిలేక మాయను విడిచి సమస్త విశ్వంలో నిండియున్నవాడు. కేవలము జ్ఞానముచే నిర్మలమై స్వయం ప్రకాశమై అవినాశీ రూపమై కోటి సూర్యకాంతులతో వెలుగొందువాడు. ప్రత్యక్ష బ్రహ్మజ్ఞాన రూపుడు. పరమ శ్రేష్ఠుడు. పరమ సమర్థుడు. పరమ రహస్యుడు. ఆ పరమాత్ముడు.

ఆది, మధ్య, అంతములేక, అనంతమై యుండి అనంత నామములతో పిలువబడినను, అనంత రూపములు కలిగియున్నను, నామ రూపములు లేనివాడు. నిరాకారుడై అఖిలాండ కోటి బ్రహ్మాండమునకు అధిపతిగా ఉన్నాడు. నిరాకార స్వరూపుడు. పరంధాముడు, పరమ పురుషుడు, పురాణ పురుషుడు, వేదవేద్యుడు. సర్వ వ్యాపకమై యున్న సర్వేశ్వరుండు. సనాతనుడు. మహాయోగులు, మునులు, ఋషులు, దిగంబరులు, ఝుటాదారులు, సాధుసంతులు, మహాత్ములు, మహనీయులు, పుణ్యపురుషాది ఇంద్రాది సరదేవతలు. గంధర్వ యక్ష, కిన్నెర, కింపురుషాది సిద్ధపురుషులకు గోచరించని వాడును. వారిచే పూజింపబడువాడును. ఆవాఙ్మానస రూపమును ఎవ్వరు చూడలేరు. చాల కష్ట సాధ్యము. పుష్పమాలకాధారము. దారము వలె సమస్త విశ్వమునకు ప్రభువై ఉన్నాడు. అవినాశిపద అమృత రూపుడు, వేద వైద్యుడు. సూర్యచంద్రులకు ప్రకాశమునిచ్చు దివ్యపురుషుడు. స్వయంతేజుడు. మనదేహములోనే ఉంటాడు. మనకంటి కగుబడదు. చాల చిత్రంగా ఉంటాడు.

# విశ్వవిరాట్ రూప పరమాత్మ

నవనాటిక సూత్రదారి పరమాత్ముడు ఆ రాముడు. మనమంతా ఈ మాయ మహేంద్ర జాలములో ఉన్నాము మేఘములో సూర్యుని వలె, ఖాడిదలో అగ్ని ఉన్నట్లు. మావిలో శిశువువలె. ఈ మాయ ఆవరణ చాల మహత్తర శక్తి కలిగి యున్నది. పుట్టించువాడు, పోషించువాడు, లయించువాడును కాదు. మనము మన గుణకర్మలను బట్టి కాలవశముచే పుట్టుచు, గిట్టుచుందుము. ఇదంతా ప్రకృతి ధర్మము. బ్రహ్మోపాసనము తప్పదు. జనన, మరణములు లేనివాడు, మోక్షస్వరూపుడు పరమాత్మ.

తన స్థూలదేహ విరాట రూపముచే మరియు తన హిరణ్యగర్భ సూక్ష్మరూపముచే నాభి ఆకాశముగాను, శిరస్సు బ్రహ్మాది లోకములుగాను, సూర్యుడు నేత్రములుగాను, దిశలు చెవులుగాను, అగ్నిహోత్రుడు నోరుగాను, ముఖము ఇంద్రుడుగాను, పాదములు పృథ్వీగాను, మనస్సు చంద్రుడుగాను, వివిధ శక్తి స్వరూపాలలో ఉండి సమస్త విశ్వము యొక్క ఉత్పత్తి, స్థితి, లయములు చేస్తూ ఉంటాడు. ఆ ప్రభువు, సమస్త విశ్వాన్ని తన చేతిలో వల్లే ధరించి సూత్రధారిగ ఉంటాడు. పరమాత్ముడు వర్ణాశ్రమ ధర్మస్వరూపుడు దివారాత్రములు, వార, పక్ష, మాస, సంవత్సరములు, కల్పంబులను భేదంబులచే కాలుడే. కాల స్వరూపుడని అంటారు. కాలపురుషుడు తన మొదటి కుమారుడని అంటారు.

సమస్త విశ్వమునకు ప్రభువై తన అసమాన ఇచ్ఛా శక్తిచే హరి హర బ్రహ్మ, ఇంద్రాది, సురకోటి దేవతలు రుద్రగణము, అష్టవసువులు, ద్వాదశాదిత్యులు, చతుర్దశ మనువులు, ప్రజాపతులు. ఈ పరమాత్ముని ద్యుతమైన శక్తి స్వరూపాలే. మునుల, ఋషుల దేవతల రక్షించుటకు ఘోర రాక్షసులను హతమార్చుటకు తనయోగ మాయ శక్తిచేత మత్స్యావతారము నెత్తి వేదములను బ్రహ్మదేవుని కిచ్చినవాడును క్షీరసాగరము మదించి, తన యుక్తిచేత అమృతమును దేవతలకు పంచినవాడును, సదా సర్వకాలము భక్తుల యోగక్షేమములో నిమగ్నమై ఉంచాడు.

కరుణా హృదయుడు, దయాసాగరుడు, దీనబంధం దీనులపాలిట కామధేనువని అంటారు. పరమాత్మున్ని భక్తప్రహ్లాదుని రక్షించుటకు హిరణ్య కశ్యపుని హతమార్చుటకు నరసింహావతారము ఎత్తినవాడును, బాల భక్తధృవుని అద్భుత తపోదీక్షకు ఆనందమొంది తన శంఖ చక్రగధా పద్మ తనదివ్య చతర్భుజ రూపముతో దర్శనమిచ్చి ధృవున్ని తన కౌగిటిలో చేర్చుకుంటాడు. ఎంత గాఢ ప్రేమ. దయాహృదయము శ్రీహరిది. భక్త హైవారి. భక్తజన బాంధవుడు. భగవంతుడు. ఘోర జపతపాదులెన్నో చేసిన యజ్ఞయాగ, యోగాది కర్మలెన్ని చేసిన, దండి దాన ధర్మాది సత్ కర్మలెన్ని చేసిన, వేదశాస్త్ర పురాణాది. సత్గ్రంథ పఠనములు చేసినగాని, పొందలేని ఆ పరమాత్మున్ని కేవలము ఆనందంలో, కామ, క్రోధ, ద్వేషములు మాని మోహమును త్యజించి, జితః మనస్కులై, నిర్మల హృదయము కలిగి నిత్యసంతోషముతో అనన్య భక్తిచే, భూత దయ కలిగి ప్రేమచేతనే పరమాత్మున్ని అతి సులభముగా పొందగలము. అగస్త్య మహముని ఇలా అంటాడు. దివ్య మంగళ రూప పరమాత్ముడైన రామున్ని దర్శించుగోరువారు జ్ఞానముచేత, అనన్య భక్తి ప్రేమతో సదాకాలము, సముచిత్తులై విషయ సుఖములు పరిత్యజించి, ధన, దార, పుత్రులపై అపేక్ష లేనివారై

ఇంద్రియనిగ్రహులై, మనస్సు, ఏకాగ్రత కలిగి, దృఢబుద్ధి కలిగి, సాధుసత్పురుషుల సాంగత్యము పొంది, లాభనష్టములు, మట్టికనకము, స్తుతినిందలు, మానపమానములు, సుఖదుఃఖములు సమదృష్టి కలిగి ఎవరైతే కలిగి ఉంటారో, శత్రుమిత్రుల యెడ సమదృష్టి కలిగి, బ్రహ్మచర్యదీక్ష కలిగి ఉండి సమస్త కర్మలు, కర్మఫలములు ఈశ్వరార్పణ చేసి శ్రీ రామ మంత్ర జపమును అనన్య భక్తి నిండు ప్రేమతో, సదా సర్వకాలము పరమాత్ముడైన, ఆ రామున్ని మననము చేయుదురో వారే బ్రహ్మనందులు. వారి యొక్క సర్వకార్యములు, సమస్త కోరికలను వెంటనే నెరవేర్చి వారికి దర్శనమివ్వ గలరని శ్రీ రామచంద్ర ప్రభు అగస్త్య మహామునికి అంటాడు. శ్రీ రాముడు, శ్రీ కృష్ణులుగా, ఎన్నో అవతారములెత్తి, దుష్ట, రావణాధిరాజులను హతమార్చి ధర్మపక్షములో నిలిచి, ధర్మజునకు దిగ్విజయము కల్గించి దుర్యోధనాదులను, దుష్టులను నాశనము చేస్తాడు. ఈ భూతలముపై భక్తుల బాధలు తప్పక తీర్చగలడు. ధర్మరక్షణ, అధర్మ నాశనము చేస్తాడు. హే భక్తజన బంధో భగవంతుని కృపాకటాక్షము అలస్యమైనను, చివరకు అమృతమే. మనము ఎల్లవేళలలో ధర్మము ననుసరించి నడువవలెను. ధర్మమే రక్ష. సత్యమే జయము. నిత్యము భగవంతుని మరచి ఉండరాదు. పరమాత్మున్ని ధ్యానించి, పూజించుట, మన నిత్యకర్తవ్యము. (ఈ సత్య వచనములు, అద్భుత ప్రవచనము నేను మీకు అందించుచున్నాను.)

నాశనమగు సమస్త శరీరములో అవినాశీ ఆత్మరూపము చేత అంతర్ బాహ్యమునందు సమస్త విశ్వంలో వ్యాపకమై యున్నాడు. పరమాత్ముడు అణువు కన్నా అతి సూక్ష్ముడు. మేరువు కన్నా ఎన్నో రెట్లు. అధికమై వ్యాపించి యున్నాడు. పరమాత్ముడు విశ్వవిరాట్ విశ్వవిరాటుడు. హిరణ్యగర్భుడు. భయనాశుడు ముక్తిధాముడు స్థితప్రజ్ఞుడు. అనంత విశ్వమునకు చైతన్య స్వరూపుడు. పరంజ్యోతి రూపతేజో రూపుడు. అకర్త, అభోక్త గుణాతీతుడు. త్రికాల జ్ఞాని, కాలరూపుడు. అనన్య భక్తుల యోగక్షేమములు చూస్తు వారి ఆపదలను, సంతోషములను, సర్వబాధలను నిరాటంకముగ తొలగింపచేసి ప్రతి సమయములో వారి మనస్సులోని కోరికలన్ని పూర్తిచేస్తాడు. భక్తుల హృదయాలలో సదానిలయమై ఉంటాడు. పరమాత్ముడు. దీనబాంధవ, దీనదయాళు, దయామయుడు అని అంటారు. సచ్చిదానంద స్వరూపమైన ప్రకృతి దయ, దోషరహితమైన నిత్యానందమై దీనుల విందై వినిపింపచేయు శ్రీ డి.కె. రావుగారి ప్రవచనము సుధారసభరిత అమూల్య ఆనందమయ అద్భుత ప్రవచనము మీరంత ఏకాగ్రతతో విని జ్ఞానమును పొంది ఆనందించండి.

శ్రీరాముల వారు లక్ష్మణునితో ఇలా అంటాడు. హే లక్ష్మణా!, నేను ఆదులేనివాడను, పుట్టుకలేనివాడను, ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేనివాడను కాను. అనగా సదా ఉండువాడను. ఇలా, అలా ఉంటాడని అనిపించడము ఏకరీతిగ సర్వంలో వ్యాపింపబడి ఉండువాడను. పూర్ణత్వము అవ్వడము. క్షీణించడము రెండును లేనివాడను. అని, లక్ష్మణునితో అంటాడు. శ్రీ రామచంద్ర ప్రభు తర్వాత అశరీరుడు. దేవదేవోత్తముడు. సర్వలోకములలో నివసించు వారికి పరమభక్తులకు, మహాయోగ పురుషులకు దర్శించుట అతి సులభుడు. హరి, హర, బ్రహ్మ, ఇంద్రాది, పరకోటి దేవతలచే పూజింపబడువాడు. పుణ్యపురుషులు ఎందరో మోక్షాది పదవులు పొందిరేగాని, పరమ పదప్రాప్తి పొందలేక పోయిరి. ఇది ఎవ్వరికి అంతు చిక్కనిదయ్యె యున్నది.

మానస మందిరములో సద్గురును ధ్యానించి గురు రహస్యమై, వేదాంత సారమై, ఉపనిషత్ వాక్యమై, గురుమంత్రమై, జీవేశ్వర రహితమై, మాయారహితమై యున్నదీ పరమ పదము. కేవలము, అవినాశీ, అమృత రూపమై, స్వయం ప్రవేశమై వెలుగొందుచున్న పవిత్ర నిలయమే పరమాత్మ సన్నిధి. ఇట్టి మహాప్రభు పరమాత్మ దర్శనమే. జన్మరహితము ఆచార్యుని పూర్ణకృపాకటాక్షమే. జన్మ రహితము. ఈరీతి భగవంతుని చూడనిదే. భ్రాంతి వదులదు.

శ్రీ గణేశాయనమః శ్రీ సరస్వతే నమః శ్రీ సీతారామాంజనేయ నమః

శ్రీ సూర్యదేవాయనమః

శ్లో॥ భ్రమేణాహం, భ్రమేణత్వం, భ్రమేణాపాసకం మనః ।
భ్రమేణేశ్వర భావత్వం, భ్రమ మూలం, జగత్

ఈ ప్రకారము సర్వము, సర్వజగత్తు, భ్రమయే, భ్రమ, ఈ భ్రమయే, భ్రాంతి. ఈ భ్రాంతియే మాయ, ఈ రీతి మాయనే శక్తి అని అంటారు. ఇదంతా మిథ్య, విశ్వ పరిచయమే మాయ, ఈ మాయ ఎటువంటిది. ఏమి వస్తువు. ఉష్ణకాలములో ఎండమావులను చూచి నీళ్ళున్నవని తలచడము. త్రాడును చూచి సర్పమని భావించడము. కేవలము భ్రమ, శ్రీ రామచంద్ర ప్రభు లక్ష్మణునితో అంటాడు. హే లక్ష్మణా! కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు నాలుగు యుగములు కలసి ఒక చతుర్యుగమని, అట్టి వేయి యుగములు గడచినచో బ్రహ్మ దేవునికి ఒక దినమగును.

వేయి బ్రహ్మలు గడచిన, శ్రీ విష్ణుమూర్తికి ఒక ఘడియ యగును. వెయ్యి విష్ణువులు గడచిపోయినచో మహేశ్వరునికి ఒక రెప్పపాటు కాలము. ఈ రీతి వెయ్యి మహేశ్వరులు గడచిపోయినచో మాయకు లేదా ప్రకృతికి, ఒక రెప్పపాటు కాలమగును. ఇంతటి మాయ శక్తి మహాబలమై యుండి, మహత్తరమై, సర్వవ్యాపకమై యుండి, సర్వస్వతంత్ర పరమేశ్వరుని ఆశ్రయించి, సర్వవ్యాపకమై యున్న నిక్షేపమను మాయశక్తి వ్యాపించి యున్నది. మాయ, సుగుణ రూపమై, నామ, రూపములతో ఉండి పుట్టి, పెరిగి, నశించునదియై యున్నది. ప్రత్యక్షమై, స్థూలరూపమై, అల్పమై, జీవులకు కర్మానుసారము ఫలనిచ్చునది మాయ.

అజ్ఞానముచేత జ్ఞానమును తెలుసుకోలేక యుండునది ఆవరణ మాయ, మహత్తత్త్వము, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, పృథ్వి, ఏడు ఆవరణములచేత కలిగియుండి ఏడు ఆవరణములతో ఒకదాని కంటే ఒక్కటి (10) పది రెట్లు అధికమై యున్నది. మాయ అఘటిత ఘటనా కర్తృత్వశక్తి మాయ. మూల ప్రకృతి ఏది మధ్యలో, సచ్చిదానంద బ్రహ్మము యొక్క ప్రతిబింబమై యున్నది. వీటిలో సత్వరజో, తమో, గుణములు కలిగియున్నవి. ప్రకృతి, ప్రకృతి యొక్క, మాయ మరియు అవిద్య రెండు విధములు. ఆ విద్యలో ప్రతిబింబరూప చిదాత్మయే, జీవుడు. జీవుడు ఈశ్వరాంశుడు. శుద్ధ చైతన్య స్వరూపుడు.

సీతమ్మ తల్లి హనుమంతునితో ఇలా అంటుంది. హే, హనుమంతా! కారుణ్యమంత మాయకు మూల కారణములు రెండు. (1) కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, ఈర్ష్య, అసూయలు (2) ధర్మాన్ని నశింపజేయునది.

గంజాయి మత్తులో మనిషి దృష్టికి ఇల్లు, సర్వ వస్తువులు తిరిగునట్లు గోచరించును. అదే విధంగా, శరీరము, ఇంద్రియముల స్థానములో ఉండి అంతఃకరణముచే, చేయబడు కర్మలు, ఆత్మపై ఆరోపింపబడిన కారణముచేత, ప్రాణులు మోహము చెందును. కేవలము, మాయకు సాక్షభూతుడు పరమాత్ముడు రాముడు. ఉత్పత్తి, పోషణ, నాశనము చేయు అది మాయను, నేనే నని తెలుసుకో. కేవలము సర్వ స్వతంత్ర, సర్వ ప్రేరకుడైన, పరమ సమర్థ పరమాత్ముని, సాన్నిధ్యముచేతనే, ఈ సర్వజగత్తును, సమస్త లోకములను, గొప్ప దక్షతతో నేను, నిర్మించుదును. అజ్ఞాని లోకులు, ఈ సర్వకర్తృత్వమంత పరమాత్ముడు రాముడే చేస్తాడని ఆరోపించుదురు. కాని, మాయా నిర్మిత, సర్వపదార్థములు ఆ పరమాత్మ రామచంద్రుడే. ఆధారమగుట వలన సృష్టి రూపముగ భాసించును అని సీతమ్మతల్లి మారుతికి బోధించును.

నామరూపములు. పంచభూతములు. ఓంకారము. సప్తకోటి మహా మంత్రములు ఇవన్నియు గుర్తుకే. సమస్త దేవతలు. భగవంతుడు, భక్తులు కూడా గుర్తుకే గుర్తెరుగనిదే పరమ పదము. ఈ పరమ పదవిలో ఏమియును లేదు. అనగ ఏమిలేనిదే పరమ పదము.

ఇదంతయు భ్రాంతియే. ఈ భ్రాంతి చేతనే తెలుసుకోవడము జరుగుతుంది. ఈ రీతి గుర్తును మరచిపోవడము ఎవ్వరికి సాధ్యపడదు. యోగులు జ్ఞానీ పురుషులు. ఈ మాయ యొక్క గుర్తునే బ్రహ్మమని యోచించి, వారంతా వారి వారి భ్రాంతిలోనే పడిపోయినారు. కేవలము దేవి పురుషులకు భ్రాంతి లేదు. వారు భ్రాంతిలో పడరు. వేదమార్గమంతా భ్రాంతియే. వేదాంతమే భ్రాంతి రహితము. వేదాంతమే పరమ పదము.

ఎంతటి గొప్పయోగ్యులైనను, పుణ్యపురుషులైనను ఒకవేళ సద్గురు యొక్క పూర్ణకృపా కటాక్షము కలిగితేగాని, భ్రాంతి లేదా భ్రమ, వదలదు. ఇతరులకెన్నటికి భ్రాంతి వదలదు. గుర్తుతోనే దాని స్వభావమును తెలుసుకొని సద్గురు దివ్యమంత్రముచే వచనములచేత అట్టి గుర్తును మరపించినచో ఇక మనకెన్నటికి సంశయము రాదు.

హే భక్తజనబంధువులారా! విపరీత భావమును విడిచి గుర్తెరుగు మార్గముల ద్వారా, సాలోక్య, సామీప్య, సాయుజ్య, స్వారూప, సాష్టిత్వాది మోక్ష స్థానములను దాటిపోయి చివరకి ఆది, మధ్య, అంతములేని నిరతిశయమైన పరమ పదాన్ని పొందవలెను.

ఎండకు ఎండదు. వర్షానికి తడువనిది. చలికి ఉలికి పడదు. అగ్నికి కాలదు. విజ్ఞానంతో గుర్తుతోనే దాని ప్రభావమును తెలుసుకొని సద్గురు వచనముచేత ఆ గుర్తును మరిపించినచో మనకిక ఎన్నటికి సంశయము రాదు. హే భక్తబాంధవులారా! విపరీత భావమును విడచి గుర్తెరుగా మార్గము ద్వారా, సాలోక్య, సామీప్య, స్వారూప్య, సాయుజ్య, సాష్టిత్వాది మోక్ష స్థానములను దాటిపోయి పరమ పదాన్ని పొందవలెను.

వేద మార్గములు రెండు భాగములు - (1) జ్ఞానకాండ (2) కర్మకాండములు. కర్మకాండ యొక్క సర్వకర్మలు, శమ, దయాది సత్యవచనములతో కర్మలన్ని శాస్త్ర విధితో చేయవలెను. శాస్త్రోక్త కర్మల యొక్క, పుణ్యసంస్కారముచే స్వర్గాది సుఖములు ప్రాప్తించును. మరియు శాస్త్ర విరుద్ధ కర్మలు చేసిన ఫలప్రాప్తి లభించక దానికి బదులు నరకప్రాప్తి పొందెదరు. బ్రహ్మ, విష్ణు, ఈశ్వరాది, ఇంద్రాది దేవతల అనుగ్రహము చేత పుణ్యకర్మల సంస్కారముచే స్వర్గాది సుఖములు

లభించును. కాని ఈ సుఖములు తుచ్ఛ సుఖములు శాశ్వతము కావు. అశాశ్వతమైనవి. ఈ సుఖములన్నీ సుఖించిన తర్వాత మళ్ళీ జన్మము తప్పదు. అందుకని సమస్త కర్మలు కర్మ ఫలములు ఈశ్వరార్పణ చేయవలెను. జ్ఞానకాండ ఆచరణ చేయు పుణ్యపురుషులు. పరబ్రహ్మానుసారము ఆరు మోక్షములు పొందుదురు. ఈ మోక్ష మార్గములు ఈ ప్రకారము ఉన్నవి వినండి. (1) సాంఖ్యా సూత్రము (2) ఆత్మ విచారము (3) నాదానందము (4) కేవలానందము (5) పరమహంస భావన (6) జ్ఞానమార్గము. ఈ మార్గములు రాజమార్గములు. అన్యమార్గములు చాల కష్ట సాధ్యము. ఆచార్యుడే గురుడు. గురువైన వారు మోక్షపదప్రాప్తి కల్గింపజేయువారై ఉండాలి. గాఢాంధకారము తొలగించి పండు వెన్నెల ప్రకాశము చూయించు వారే ఆచార్యులు. సద్గురువు సద్గురువే బ్రహ్మ స్వరూపము. పరమ పదము. సద్గురు యొక్క పూర్ణకృపా కటాక్షమే పుణ్యపదము. యోగము, జ్ఞానము, జన్మపావనము, జన్మరాహిత్యము, సర్వకర్మ నాశనము, గురుమంత్రము, సర్వవేద శాస్త్రముల సారాంశము, పాపనాశనము, త్రిలోక సమ్మతము, త్రిలోక పావనము, గురుదర్శనమే జన్మపావనము. త్రిలోక సమ్మతము, త్రిలోక పావనము మోక్షప్రాప్తి, గురుపాద తీర్థమే అమృతము. భుక్త విశేషము, మహా ప్రసాదము. అండపిండ బ్రహ్మాండమంత చరాచరమంత గురువే బ్రహ్మ., విష్ణు, మహేశ్వరాది సురకోటి దేవతల సమానమే సద్గురువు. గురువే ముక్తికాంత సద్గురు పూర్ణదయయే పరమ పద సాక్షాత్కారము త్రికరణశుద్ధిచే, భక్తిప్రేమ భావముతో ఏ శిష్యుడైతే గురు ఆజ్ఞపాలకుడై ఉండునో అటువంటి శిష్యుని సమానము ఎవ్వరు కారు. హరి హరః బ్రహ్మ ఇంద్రాది దేవతలు సమస్త భూతకోటి ఇటువంటి శిష్యునికి భయపడి ఉంటారు. ఇంతటి అద్భుత మహిమ శిష్యునిదై యుండును. ఆహా ఎంత మాధుర్యమైనది. మనస్సుకు ఆనందము కల్గించు (శ్రీ డి.కె.రావు గారి) సుధారసమయ ప్రవచనము. ఎంత విన్నను ఆనందమే. మహా ఆనందమై యున్నది.

# సాలోక్య మోక్షపద మార్గము - సాంఖ్యా సూత్రము

సాంఖ్య సూత్రమనగ పంచభూతముల వేరు వేరు భాగముల విభజన, లేదా పంచీకరణమని అంటారు. సాంఖ్య సూత్రమును బట్టి చెయుండును. గురుజ్ఞానోపదేశముచే, గురుమంత్రము ద్వార పంచభూత స్థానములు, షడాధార చక్రములు, అధిష్ఠానాధి దేవతల గూర్చి తెలుసుకొనడమే సాలోక్య మోక్ష పదవికి మార్గమని అంటారు. మనస్మృతి ప్రకారము సర్వంఖల్విదం బ్రహ్మ ను సారము

ప్రప్రథమము నిర్వికార అచల పరిపూర్ణ పరబ్రహ్మము. ఈ దివ్య ఇచ్ఛాశక్తిచే దివ్యజ్ఞాన శక్తి గల విరాట్ పురుషుడు పుట్టే. విశ్వ విరాట్ పురుషుని ద్వార తెలియని మూల ప్రకృతి పుట్టే. మూల ప్రకృతి నుండి మహతత్వము. మహతత్వము నుండి అహంకారము పుట్టే. పరమాత్మ అహంకారము నుండి సత్వ, రజోత్తమ, మూడు గుణములు పుట్టినవి. తామస అహంకారము నుండి సూక్ష్మ భూతములు పుట్టే. ఈ సూక్ష్మ భూతముల నుండి స్థూల భూతములు పుట్టే. రాజస అహంకారము నుండి పది ఇంద్రియములు పుట్టినవి. సాత్విక అహంకారము నుండి దేవతలు మరియు మనస్సు పుట్టే. సృష్టిని ఉత్పత్తి చేయు దీనితో సూత్రాత్మ ప్రాణమైనది. ఇదంతా కలిసి సర్వవ్యాపక, సమిష్టి లింగ శరీర మేర్పడినది. దీనికే హిరణ్య గర్భమని అంటారు. సృష్టిని ఉత్పత్తి చేయు బ్రహ్మ పుట్టే. బ్రహ్మచే, ఆకాశము, ఆకాశముచే వాయువు, వాయువుచే అగ్ని, అగ్నిచే జలము, జలముచే పృథ్వి, పృథ్విచే పృథ్విపై ఔషధములు పుట్టినవి. స్థూల భూత సముదాయము నుండి విశ్వము పుట్టి తద్వార సర్వభూత సృష్టి ఏర్పడినది.

పంచ భూత తత్వములు ఈ విధంగా ఉన్నది తెలుసుకొనగలరు.

పృథ్వి తత్వము - అస్థి, మాంస, చర్మనాడి, రోమములు

జలతత్వముచే - రక్త, వీర్య, మూత్ర, లాలజలము కపశ్లేశ్మములు

తేజతత్వముచే - ఆకలిదప్పులు, నిద్ర, ఆలస్య, కాంతి మొ॥వి కలుగును

వాయుతత్వముచే - చలన, దావన, వలన, ప్రసరణ - అంకుచనాది కలిగినవి.

ఆకాశతత్వముచే - కామ, క్రోధ, శోక, మోహ, భయములు కలుగును.

కర్మేంద్రియ పంచకము - వాక్కు, పాణి, పాద, శిశ్న, గుదము, వీటి యొక్క విషయ పంచకములు : వచన, ఆదాన, గమన, ఆనంద, విసర్జనాది —

వీటి అధిష్టానాది దేవతలు - అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, ప్రజాపతిమయుడు.

జ్ఞానేంద్రియములు పంచకము - శ్రోత, త్వచ, చక్షు, జిహ్వా, ఘ్రాణము

వీటి విషయ పంచకములు - శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధము

అధిష్టానాది దేవతలు - దిశా, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీ కుమారులు

నాలుగు అంతఃకరణములు - మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము

వీటి విషయములు - సంకల్ప వికల్పములు, నిశ్చయము, చింతనము, అభిమానములు

వీటి అధిష్టానాది దేవతలు - చంద్రుడు, బ్రహ్మ, నారాయణుడు, రుద్రుడు.

ఈ ప్రకారము స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములను శరీరము లేర్పడెను. ఈ విధంగా, కాలము, కర్మమును బట్టి దేవతలు, మానవులు రాక్షసులు, పశుపక్షాది, క్రిమి కీటక, జలచరాది మొ॥ జీవకోటి నిర్మాణమై యున్నది. సత్వ, రజో, తమ, గుణభేదాలచే హెచ్చు తగ్గులుగా బుద్ధికి గోచరించును. దీనిచే, జాగ్రత్, స్వప్న, సుశుప్తాది, అవస్థ లేర్పడినవి. వీటికి వేరైయున్నాడు. ఆ పరమాత్ముడు పదినాడులు, సప్త వ్యసనములు, తను వ్యసనము, మనో వ్యసనము, ధనవ్యసనము, రాజ్య వ్యసనము, విశ్వ వ్యసనము, ఉత్సాహ వ్యసనము, సేవకా వ్యసనములును. పంచ ప్రాణములు, పంచ ఉపప్రాణములు మన శరీరములో ఉండును. ఇవి ప్రాణవాయువు హృదయ స్థానములో, సమాన వాయువు నాభిస్థానములో, ఉదాన వాయువు. కంఠస్థానములో, వ్యాన వాయువు. సర్వ శరీరములో, అపాన వాయువు గుద స్థానములో మరియు ఉప, ప్రాణములు, కూర్మ, కుక్కుర, దేవదత్త, ధనంజయ, నాగ, మన ఉపవాయువులు.

ఊర్ధ్వలోకములు మన నాభి నుండి పై బ్రహ్మ కపాలము వరకు నాభి స్థానము పృథ్వీ, భూలోక, స్వర్గలోక, మహర్లోక, జన, తపో, బ్రహ్మ లేదా సత్య లోక, అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళములని. అదోః లోకములు నాభి నుండి క్రింది వరకు ఉండును. సమస్త లోకములు మన శరీరములో ఉండును. మనయందు పంచాగ్నులు కలవు. కాలాగ్ని పాదముల యందు, క్షుదాగ్ని నాభియందు, శీతాగ్ని హృదయము నందు, కోపాగ్ని నేత్రముల యందు, జ్ఞానాగ్ని, ఆత్మయందుండును. మరియు క్షడాదారములు ఈ ప్రకారమున్నవి.

(1) ఆధార చక్రము గుద స్థానము. ఆది దేవుడు వినాయకుడు. ఇచ్ఛా శక్తి కలిగియుండును. పృథ్వీ, ఘ్రాణకారణము కలిగి యుండును. 1ఘడియ 40 విఘడియలలో 600 జపము హంస జపము జరుగును.

(2) స్వాదిష్ఠాన చక్రము - లింగస్థానము - ఆధారమునకు 2 అంగుళములు పైన ఆది దేవుడు, బ్రహ్మ, క్రియాశక్తి, జలస్థానము, జిహ్వా కారణము, 16-40 ఘడియలు 40 విఘడియలలో 6000 హంస జపము జరుగును.

(3) మణిపూరక చక్రము నాభి స్థానము, విష్ణుమూర్తి ఆది దేవుడు, జ్ఞానశక్తి, అగ్నిముద్ర, తేజ తత్వము నేత్రకారణము. 16 ఘడియలు 40 విఘడియలలో 6000 హంస జపము జరుగును.

(4) అనహత చక్రము - హృదయ స్థానము - ఆది దేవుడు, రుద్రుడు, బీజశక్తి, వాయుస్థానము, త్వక్ ఇంద్రియ కారణము. 16 ఘడియలు 40 ఘడియలలో 6000 హంస జపము జరుగును.

(5) విశుద్ధ చక్రము - కంఠస్థానము - దేవుడు - ఆది దేవుడు, ఆది శక్తి, ఆకాశముద్ర, శ్రోత స్థానము. 2 ఘడియలు 45 విఘడియలలో 1000 (ఒక వేయి) హంస జపము జరుగుచుండును.

(6) ఆగ్నేయ చక్రము - భూ మధ్యము - ఈశ్వరుడు - అధిష్టాన దేవత అంతఃకరణ సదనము, పరాశక్తి, ప్రకాశ ముద్ర, సర్వ దృష్టి స్థానము. 2 ఘడియలు 40 విఘడియలలో 1000 (ఒక వేయి) హంస జపము జరుగును.

(7) సహస్రారము - బ్రహ్మ కపాలము - గురుమూర్తి, ఆది దేవుడు ఓం బుద్ధి నిలయము 1000, జప సంఖ్య జరుగును. సాంఖ్య సూత్ర ఆధారమును బట్టి యుండును. దీనినే సాలోక్య, మోక్ష స్థానమని అంటారు.

## సామీప్య మోక్ష పదమార్గము - ఆత్మ అనాత్మ భేదము పరాత్మ, మరియు ఈశ్వరుడు జీవుడు, శుద్ధ చైతన్యము వీటి తత్వములు దీని పరిచయమే - సామీప్య మోక్షపద మార్గము.

హే భక్తజన బంధువులారా! అధర్వణ వేదసారమగు, అయమాత్మ బ్రహ్మ ఈ మహా వాక్య అక్షరమును బట్టి ఆత్మయే చైతన్య స్వరూప బ్రహ్మంబన బడును. త్రేతాయుగములో శ్రీ రామచంద్ర ప్రభు, తన పరమభక్తుడైన భక్త మారుతితో ఇలా అంటాడు. హే హనుమంత కారుణ్యవంత.... ఆకాశము, మహాకాశము అనగా సర్వంలో వ్యాపించియున్న ఘటాకాశమని, వీళ్ళలో ప్రతిబింబరూప ఆకాశము అను భేదములతో మనకు గోచరించును. బుద్ధి రూప ఉపాధి యుక్త శుద్ధ చైతన్య రూపమే ఈశ్వరుడని. ప్రతిబింబ రూప శుద్ధ చైతన్యమే జీవుడని. ఆధార భూత శుద్ధ చైతన్యమని మూడు భేదములు కలిగి చేయుండునని శ్రీ రామచంద్ర ప్రభువు బోధిస్తాడు. చైతన్యమే బిందు, బిందుచే నాదము, ఓం కారముచే త్రిగుణములు, త్రిగుణములచే సంకల్ప వికల్పములు, సంకల్ప వికల్పముల చేతనే సమస్త సృష్టి ఏర్పడినది. సర్వసృష్టి నామ రూపమై యున్నది. మరియు సమస్త ప్రాణికోటి మూలాధార చైతన్యముతోనే కలదు. మనలోని మన స్వయంభూ స్వయం ప్రకాశుడై వెలుగొందు పురుషుడే శుద్ధ

చైతన్య పురుషుడు. ఈ చైతన్య పురుషుడే సర్వ ప్రాణులలో ఆత్మ స్వరూపములో ప్రకాశమానుడై ఉన్నాడు. అందుచేతే సమస్త ప్రాణులు చైతన్యవంతులై కనబడతారు

ఈ సర్వచేతనములో దేవతలు, మానవులు జంతు, పశు, పక్షాది, జలచర క్రిమికీటకాది సర్వప్రాణి మాత్రులు. వృక్షలతాదులు సర్వం ఈ చైతన్యము వలననే చైతన్యమై యుండును. ఇదంతా బ్రహ్మ సృష్టియనబడును. ఆత్మ స్వయం ప్రకాశమగుట వలన, ఆత్మ సర్వసాక్షి, సర్వస్వతంత్రమై యుండి సర్వ ఇంద్రియ ఆధారమై యున్నది. ఆత్మయే సూత్రధారి పరమాత్మ రూపమై యున్నది.

మోక్ష పదమును నిచ్చువాడే పరమాత్మడెవడు కలడో, ఆ ఆత్మయే సద్గురు. తల్లి తండ్రి, దైవము సర్వము అతడే ఆత్మయే గురు రూపము సద్గురునైన వారు శిష్యునకు నిష్కళంకమగుదైన సాక్షాత్కారము చేయించవలెను. అట్లు చేయించిన దివ్య పురుషులే సద్గురువు. అతడే ఆచార్యుడు.

ఈ సమస్త భూతకోటిలో, విశేషజ్ఞులని, శాస్త్రజ్ఞులని, మాన్యులని, సామాన్యులని, కించజ్ఞులని, దేవమానవ ఉచ్ఛ, నీచ, పశు, పక్షాది, సర్వ ప్రాణులలో కలిగి యుండును. విశేషజ్ఞులంటే, సామాన్యమా? వినండి, సాక్షాత్ దైవాంశముతో పుట్టినవారు -

బ్రహ్మ నిష్ఠ కలిగి జ్ఞానియై యుండవలెను. నైష్ఠిక బ్రహ్మచర్యదీక్ష కలిగి, శరీర శుద్ధి కలిగి, జితఃమనస్కులై, ధృఢబుద్ధి కలిగి ఉంటారు. మిత భాషియై, నిర్మల హృదయులై, కామ, క్రోధ, మోహములను త్యజించిన వారై, సుఖదుఃఖములలో సమచిత్తులై, ధనికుల ఎడల, పేదల ఎడల సమదృష్టి కలిగి ఉంటారు. మట్టి కనకము, మానావమానములలో సమభావన కలిగి ఉంటారు. జిహ్వ చాపల్యము ధృక్చాపల్యము లేనివారై ప్రపంచ రహితులై, త్యాగులై, దానము చేయు గుణము కలిగి ఉంటారు. నిజ సత్ గుణవంతులై, ఇతరులకు భోజనము అర్పించి తినువారును, సత్యవాక్కు కలిగి ఉండడము. నిష్కామకర్ములై, జితేంద్రియులై, నిరాడంబరులై, నిత్యానందులై ఉంటారు. పై లక్షణములన్నీ ఉండబట్టి ఆత్మ వారిలో అధికంగా, ప్రకాశించును. జ్ఞానులై, అనుభవజ్ఞులై ఉంటారో వారు విశేషజ్ఞులు. ఆత్మ కోటిలో శ్రేష్ఠుడైన మానవుడే విశేషజ్ఞుడనబడును. విశేషజ్ఞుడే సద్గురుడు. వాక్కు సిద్ధి, సంకల్ప సిద్ధి కలిగి ఉంటారు. ఇలాంటి వారు పలికిన మాట ఫలమౌను, వీరు మాయకు చాల దూరములో పరమాత్మునకు అతి సమీపములో, చాల ప్రీతిగ ఉంటారు. ఇటువంటి శ్రేష్ఠుడైన సద్గురు రూపమే బ్రహ్మ స్వరూపమని, ఆది శక్తి నారాయణుడని, శివుడని

భావించవలెను. మోక్షపదమును ప్రాప్తింపజేయు అచల గురువు కులహీనుడైనను బ్రహ్మణుని కంటె శ్రేష్ఠుడు, బ్రహ్మ జ్ఞానము వలన బ్రాహ్మణుడుగాని కులగోత్రములచే ఎన్నడు కాదు. జగద్ గురువు శ్రీ కృష్ణ పరమాత్మ అంటాడు. జన్మతో శూద్రుడై ఉపనయనాది. యజ్ఞోపవీత ఉత్తమ, కర్మ సంస్కారముచే, ద్విజుండగును. వేద శాస్త్ర విధితో సమస్త యజ్ఞయాగాది దేవతార్చన, మొ॥ పుణ్యసత్ కర్మలచే విప్రుడనబడును ఎవరైతే బ్రహ్మ జ్ఞానము కలిగి ఉన్న పుణ్యపురుషులెవరైనను వార బ్రహ్మణులనబడుదురు. నీచ జాతిలో జన్మమెత్తిన శాంత, క్షమ, దయాది గుణముల కలిగి సత్కర్మలచే మతంగ మహాముని తన ఘోర, తపో యోగ బలముచేత బ్రహ్మజ్ఞానము పొంది బ్రాహ్మణుడై ఋషిస్థానమును పొందెను. బ్రహ్మమును తెలుసుకొని బ్రహ్మసాక్షాత్కారము పొందిన పుణ్యపురుషులే బ్రాహ్మణులు.

భూత దయ కలిగి సర్వప్రాణి కోటి హితమును కోరే వారే. సద్గురు రూపము వీరు మాయకు దూరమై, పరమాత్మునకు అతి సమీపులై ఉందురు. సద్గురుని సంతోషపర్చి, గురు కటాక్షమును పొందిన పాప క్షమమగును. బంధ రహిత మోక్షము లభించును. కావున ఇట్టి స్థితినే సామీప్య మోక్షమని అంటారు.

# స్వరూప మోక్షమార్గము - ఆనంద భావము

ఇంద్రియ విషయ సుఖములను త్యజించి, అభ్యాస వైరాగ్యములచేత మనస్సును ఏకాగ్రతమంచినచో ఇక సంకల్ప వికల్పములుండవు. సంకల్ప వికల్పములు లేని మనస్సే హృదయమును నిర్మల పర్చును. నిర్మల హృదయమే దివ్య పరమాత్మా నిలయము. పరమాత్మ నిలయమే సచ్చిదానందము.

ఆనందో బ్రహ్మ మనస్మృతి ననుసరించి ఆనందమే బ్రహ్మ స్వరూపము. దీనిని ఆనందమని, కేవలానందమని రెండు విధములు. భూలోక వివిధ సుఖములు ఆనందములు కావు. సుందర యవ్వన, స్త్రీ, పురుష భోగములు ఆనందము కాదు. కోట్ల డబ్బు కూడ బెట్టుట ఆనందము అసలే కాదు. ఇది కాక దేవతలు పొందే స్వర్గాది సుఖములు కూడ ఆనందము కాదు. సర్వప్రాణుల యందు, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ పంచకోశములుండును. కావున మానవుడు ఆనందమయ కోశము నందే విహరించిన మోక్షానందము పొందును.

చిత్తము జ్ఞానముతో కూడుటయే ఆనందము. కాబట్టి మనము ఏలాంటి భ్రాంతి లేక రాత్రి మూడవ జామున మేల్కొని పవిత్ర స్థలములో కూర్చొని గురుమంత్రమును జపించుచూ మనయందుండు జలధి, భేరి, ధ్వని, మృదంగ, గంటా, కళహాళ, కింకిణి, వేణు, భ్రమర, ప్రణవ, దశవిధ దేవవాదంబుల వినవలెను. అట్టి నాద బ్రహ్మము నందు మనస్సును నిలిపిన నాదమే సత్, మనమే చిత్. ఈ సత్, చిత్ ల ఏకీభవించిన వారే, సచ్చితానందమూర్తులు. నాదానంద సుఖమే, బ్రహ్మనందము. ముక్తి కాంతామణి, సహస్రార కమలము నుండి బ్రహ్మదండి వీణగాను, ఆధార, స్వాధిష్ఠాన మణిపూరక, అనాహత, విశుద్ధ, అగ్నేయాది చక్రములు, మెట్లుగాను, పంచప్రాణములు తంత్రులుగ జేసి, దేవవాదంబులను వినవలెను. చిత్తము ఈ దశవాదంబులపై నుంచిన నాదానందము గాంచుదుము. నాదానందమే, సుఖానందము, సంతోషము, సర్వపాపక్షయము. పుణ్యప్రదము, నిత్యము, సత్యము, నిర్మలమైనది. ధర్మయుక్తమై శుభంబైనది. ఇంద్రియ జయము, బంధనాశము, విశ్రామము, జన్మపావనము, ఇష్టసిద్ధి కలుగజేయునది. త్రిలోక పూజనీయ, శత్రునాశిని, శంఖచక్రములు ఘోషించు నాద బ్రహ్మమును, నేత్రములు మూసికొని భ్రూ మధ్యమున దృష్టిని నిలిపి వినవలెను. నాద బ్రహ్మమునందు బిందు రూప చిత్తమును కూర్చుటయే కళ. నాదమనే ఈశ్వరుని యందు బిందువను దేవుని కూర్చుటయే జీవేశ్వరుల ఐక్యము. జీవేశ్వరుల ఐక్యమే బ్రహ్మసిద్ధి. బ్రహ్మ సిద్ధియే నాద బ్రహ్మనందము. నాదబ్రహ్మనందమే స్వరూప మోక్షము.

# సాయుజ్య మోక్ష మార్గము - కేవలానందము చిత్త శాంతి

హే విశ్వాత్మ స్వరూపులారా! చిత్తశాంతి కేవలానందము, కేవలానందమే సత్యానందము. బ్రహ్మనందము దీనినే నిర్వికల్ప సమాధియని యందురు. ఈ అవస్థలో మౌనము ధరించి సర్వకాలములో ఆత్మారాముని జపించుచు రాత్రివేళ కుండలీ యోగమును జేయుచు, ఏకతిత్తిని బలియముగా నూదుచు, అజప కుండలిని భేదించి మధ్యబాట యందు తాండవమాడుచు మధుర వేణువాదమును వినుము. ఊర్ధ్వకుండలిని దాచి చిత్కళను మీరి మండలమును గాంచుచు, మనస్సును నాద, బ్రహ్మమునందు లీనము గావించి హంసను త్రివేణి సంగమున నిలిపి, మహాజ్యోతి ప్రకాశమును గడచి బట్టబయలునకు బ్రాకుటయే నిరంతర నిర్వికల్ప సమాధి లక్ష్యము.

పూర్వము గంధర్వాది, సిద్ధ పురుషులు. వశిష్ఠాది బ్రహ్మాది ఋషులు, జనకాది, రాజఋషులు మొ॥ పుణ్యపురుషులు ఈ నిత్యానందమును పొందే సాయుజ్యమును పొందిరి. సామవేద సారమగు తత్వమసి అను మహా వాక్యమున కర్ధము. త్వం పదమనగా, 25వ తత్వజ్ఞతయనే, జీవుడు అవిద్య ప్రతిబింభితుడు. తత్‌పదమనగా, 26వ తత్వమగు జ్ఞానమను ఈశ్వరుడు మాయ ప్రతిబింబితుడు. ఈ జీవేశ్వరుల కలయిక అసి పదము, జీవుడవగు నీవు ఈశ్వరుడవగుచున్నావని, తాత్పర్యము. కాబట్టి జీవశబ్ద వాచ్యుడైన జీవుడు చిత్తుడు. ఈశ్వరవాచ్యుడైనదీ నాద బ్రహ్మం అందువలన నాద బ్రహ్మము నందు చిత్తము లీనమగుటయే జీవేశ్వర ఐక్యము.

ఈ ప్రకారము సమాధి పొందిన వారే సచ్చితానంద మూర్తులు, యోగులు, బ్రహ్మస్వరూపులు, నాద బ్రహ్మము పది శిరస్సులు గల ఘోరసర్పము - వాటి నుండే దశనాదములు వినబడును. ఆ సర్పమును భేధించుటకు హంసయే నాద బ్రహ్మమునకు తండ్రి. ముక్తి కాంతమే తల్లి. హంసయే ఆత్మారాముడు. గురు మంత్రమును జపించుచు, రాత్రి మూడవ జామున కూర్చుని నేత్రములు మూసికొని భ్రూ మధ్యమున లక్ష్యము నిలిపి ధృక్కును నిలిపి, రేచక పూరకములచే, హంసను చక్కగా నడిపించుచు, ఇడా పింగళ నాడులయందు సంచరించుచు హంస యొక్క సంచార శ్రేవల నడగించి ఇతర మార్గముల చిద్రున రేపించుచు, సూర్యనాడి చంద్రనాడి యందు, చంద్రనాడి సూర్యనాడి యందును, ఈ చంద్ర సూర్యుల్ని చిరాగు వర్చి గతులు తప్పించుచు, సర్పమునకు వేడి పుట్టించుచు అజపకుండలిని భేధించి, త్రేతాగ్నుల ఏకీభవింప జేసిన శంఖ చక్రముల మధ్యన యుండు కోడే సర్పము అప్పుడు నిల్వక, ఝుంకారము చేయుచు బయటకు వచ్చి దశనాదములు చేయుచుండును. అప్పుడు కలిగే నాదానందము గూర్చి చెప్పుటకు బ్రహ్మాదులకైనను తరము కాదు. అదియే నిర్వికల్ప సమాధి, అదే మహానందం. పూర్ణబ్రహ్మానందము. ఇదే రాజమార్గము. చాల శ్రేష్ఠమైనది. ఆత్మ ధ్యానమే అతి సులభ మార్గము మరియు విశేషఫలమిచ్చును. ఈ రాజయోగములు రెండు విధములు. (1) రాజయోగము (2) మౌనరాజయోగము. రాజయోగమునకు భూచరి, ఖేచరి, షణ్ముఖి, శాంభవి, అంతర్ లక్ష్యములనే పంచముద్రలు మార్గములు. మౌనరాజ యోగమునకు ఆత్మధ్యానము, కుండలీ యోగము. నాద బ్రహ్మానందము 3 మార్గములు. పంచ ముద్రలు చాల కష్టసాధ్యము ఆత్మధ్యానమే అతి సులభ మార్గము మరియు విశేష ఫలమిచ్చునది.

యజుర్వేద సారమగు అహంబ్రహ్మాసి అను మహా వాక్యము అను ఆత్మధ్యానమే ఐక్య సమాధి. ఆత్మధ్యానమే విశ్రాంతి. ఇదే కేవలానంద సాయుజ్య మోక్ష మార్గము.

కేవల సాష్టిత్వ పదమోక్ష మార్గము - తానే పరమహంస భావము. శబ్ద బ్రహ్మమే నాద బ్రహ్మము. నాద బ్రహ్మమున కాధారము వాక్య బ్రహ్మము. వాక్య బ్రహ్మమే పరమహంస. పరమ హంసయే ఆత్మారాముడు. ఎన్నో ఆశాపాశాలలో పడి తుచ్ఛ సుఖముల కాశించి మహా ఘోర మాయజాల సంసారములో చిక్కుకొని కేవల సుఖానందమగు మోక్షపద అవినాశీ అమృత సుఖములను మరచి వ్యర్థముగా పుట్టుచు, చచ్చుచూ 84 లక్షల యోనులలో తిరుగుచుందురు. వీటిని రూపు మాపుటకు జన్మరాహిత్యమునకై బ్రహ్మనిష్ఠ సద్గురుని జేరి వారి పూర్ణకృప కటాక్షములతో జన్మరాహిత్యము పొంది మళ్ళీ ఈ జన్మ లేకుండ చేసుకోవాలి. ఆత్మాధ్యానమగు పరమహంస భావము. త్రిలోక సమ్మతము త్రిమూర్తుల ఆత్మ స్వరూపము. ఉపశ్రుతి వాక్యమై వెలయు కేవలానంద పదవిని పొందవలె. సప్త కోటి మహామంత్రములకు మూలమంత్రమే ఏకాక్షర ప్రణవము. ఇదే తారకము సోహంభావమును కటాక్షించి, య అక్షర ద్వయముతో చిత్తసంధానము గావించి, మౌనవ్రతములో జపించవలెను. సర్వమునందు సమభావన కలిగి సమదృష్టి ఉంచి భేదాభేదములు లేక తానే పరమహంసయను కేవల సాష్టిత్వ పదవిని పొందవలెను. ఆత్మారాముడే సర్వలోక ఆధార భూతుడు. సర్వేంద్రియములకు, ప్రకృతి ద్వయము. ఉపాధి ద్వయము. ఆత్మారాముడే. సర్వ ప్రపంచము, సర్వప్రాణులు, ప్రాణుల యందు చైతన్యమును సర్వప్రాణుల యందు గల హంసరూపుడు. అంతర్ బాహ్యములో వ్యాపించి సర్వకాలమున సర్వావస్థల యందు ఏకరూపముగా వెలుగొందువాడు. ఆత్మారాముడు, ఆత్మారామ బ్రహ్మము షడాధారములకు తంత్రీరూపకమై, యారోహణ, వరోహణములు కలిగి ఇడా పింగళనాడుల యందు సంచరించుచుండును. ఆత్మారాముని రాకపోకల యందు శబ్దించు అక్షరములు రెండు ప్రణవము. ప్రణవమే సోహం. సోహమే గురుకీలకము. వేదసారము, ఉపనిషత్ వాక్యము. గాయత్రీదేవి అంతా సోహమే. సప్తకోటి మహామంత్రములకు తల్లి ప్రణవమే. ప్రణవమే హంస హంసయే పరబ్రహ్మము. అజప, అహంబ్రహ్మాస్మి మహావాక్యము. జీవేశ్వర ఐక్యము. యజుర్వేద సారమగు నాద బిందువుల కూడికయే, యోగము. సత్, చిత్ సంధానమే యోగము. త్వంపద, తత్ పదముల వాక్యార్థమే యోగము లక్ష్యార్థము. హంసను త్రివేణి సంగములో పొందుపర్చుట. యోగము, సూర్యచంద్రనాడుల గడచి శుషుమ్నాడిలో హంస నెక్కించుట. యోగమే, సర్వభూత కోటిలో పరబ్రహ్మం ఒక్కటే ఆధారము. జాతి, కుల, మత భేదములు. వర్ణాశ్రమ ధర్మములు లేవు. ప్రణవము ధరించిన వారే పరమహంస, ప్రణవ ధ్యానమే. ఆత్మధ్యానము ఆత్మయే. నిర్వికారము, నిరాకారము,

సాకారము, అమృతము మానసపూజ, సర్వపాపక్షయము, బంధనాశము. ఇంద్రియ జయము అంతరంగ భక్తి, ఆత్మారాముడు దివారాత్రములు కలసి ఒక దినమున 21600 సంఖ్య జపము ప్రణవజపము చేయుచుండును. ఈ సంఖ్య జపము షడాధార చక్రములలో జరుగును. ఈ జపమును గురుమంత్రంచే అనుసరిదానించి జ్ఞానేంద్రియమైన జిహ్వతో చేయాలి. పెదవులను బంధించి మారుతమును నియమించి ఇడాపింగళానాడుల యందు సంచరించు హంసుని వెంట, చిత్తమును సంధానము చేసి సదా సర్వకాలము జపించుచుండవలెను. మౌనము ఇది రహస్యము. ఇదే తారకము. చిత్తమే మనస్సు. ఈ మనస్సుచే సంధానము చేయుడమే సిద్ధము. ఈ నామమునే తారకమని అంటారు. మనసు తనకాధారమైన ఆత్మారాముని బట్టి జపించుచునేగాని, ఇతరుల్ని ధ్యానించదు. ఈ రహస్యము తెలియక తికమక పడుతారు. సద్గురువుచే, గురు కీలకమును గ్రహించి జపించుటయే మనోధర్మము. సర్వేంద్రియములకు మనసు రాజు. ఈ మనసు వలననే బంధ, మోక్షములు, ధర్మాధర్మములు, జన్మ మరణములు. కష్టసుఖములు, సర్వమునకు కారణము మనస్సే. అతః మనస్కులే జన్మరహితులు. మనస్సే, జీవుడు. జీవుడే నామ, రూపములు గల సర్వమునకు నాధారభూతుడు. జ్ఞానమే ఆత్మ. జ్ఞానమే దేవుడు. జ్ఞానమే ఆత్మారాముడు. ఆత్మారాముడే, కార్యాకారణుడు. ఇదే పరమహంస భావము. ఇదే సాన్నిత్వ మోక్షపదవికి మార్గము.

హే, భక్తజన బంధవులారా! ఈ అమూల్యమైన ప్రవచనము విని, కని తరించండి. అతి ముఖ్యమైన పరమ శ్రేష్ఠమైన జ్ఞానము గూర్చి మరొకసారి.

కేవలము జ్ఞాన స్వరూపమే, పరమ పదము. పరమపదమే అవినాశీ, అమృత రూప, స్వయం తేజము. ఋగ్వేద యుక్త, ప్రజ్ఞానంబ్రహ్మయను మహా వాక్యమును బట్టి ప్రజ్ఞానమే బ్రహ్మమని తెలియపర్చునది ఇది కదా. ఈ జ్ఞానము మూడు విధములు.

(1) సమస్త ప్రపంచము ప్రపంచములోని నామ రూపములు గల, సర్వజగత్, వాటి విషయములు తెలుసుకోవడము ప్రపంచ జ్ఞానమని అంటారు.

(2) శాస్త్రములచేత తెలుసుకోవడము శాస్త్రజన్య జ్ఞానమని

(3) నిర్వికారమై, నిరాకారమై, నిరామయమై, స్వయం దీపమై వెలుగుచుండు వారి జ్యోతిని గురు ముఖము నుండి తెలుసుకొని ఆ పరబ్రహ్మమును. ప్రత్యక్షముగ

దర్శించుటచేత బ్రహ్మ జ్ఞానమని మూడు విధములు. జ్ఞానము దీనిని అర్యదర్పణ భావమని దీవాన్ లైటు అని అంటారు. జ్ఞాన స్వరూపము 2 విధములు. (1) దర్పణ భావము (2) అర్యదర్పణ భావమని.

దర్పణ భావము వలన ప్రతిబింబ చైతన్య నీలతోయమందు, సర్వం లీనమగుట. గురు కృపచే నెరగి విద్యుల్లేఖయను పరమాత్మ కళను దర్శించి, విశ్వకళారూపమైన పండు వెన్నెల గాంచునదియే తానని, తానే పరమాత్మయని, సచ్చిదానందమని, భావింతురే గాని, అపోజ్యోతిని దర్శింపలేరు. ఇది కూడ నిజమైన మార్గము కాదు.

అర్యదర్పణ భావమే నిజమని, అర్యదర్పణమున ప్రతిబింబ చైతన్యము, శుద్ధ చైతన్యనము నిజబింబమును దర్శించుటయే, అర్యదర్పణ భావము. సంశయమున్న వారికి, లేని వారికి అపోజ్యోతి దర్శనమే మోక్షము. ఇందులో ఎలాంటి సంశయము లేదు. మనో నిశ్చయము గల పుణ్యపురుషులు - సంశయము లేక, సమదృష్టి చేత సర్వంబ్రహ్మ స్వరూపమని దర్శించుచు దేనియందు వాంఛలేక నిర్మోహులై యుండిన భయము లేదు.

# అన్ని ఆశ్రయములలో గృహస్థ ఆశ్రయమే చాల శ్రేష్టమైనది.

గృహస్థ ఆశ్రయములోనే అన్ని ధర్మములు, సత్ కర్మలు. శాస్త్రములచేత తెలుసుకొని సత్పురుషుల అనుభవజ్ఞానోపదేశముల చేత కర్మమార్గములు శాస్త్ర విధితో చేయుచు కామ, క్రోధములు, అహం, మమతలను, డంభ, రాగములను, ఈర్ష్య అసూయలను మనలో లేకుండా చేసికొనవలెను. ఆశ, కోరికలు, మాని మనలోనున్న విషయ సుఖములను పూర్తిగా నశింపజేసుకొనవలెను. శత్రుమిత్రులు సుఖదుఃఖముల యందు సమచిత్తులై, బ్రహ్మచర్య దీక్ష కలిగి యుండి ఏకాగ్రతలో ధ్యానములో కూర్చొని నిశ్చల మనస్సును, బుద్ధిలో, దృఢ బుద్ధిని ఆత్మలో లయము చేయవలయును. గురుమంత్ర సంధానులై జాగ్రత్త, స్వప్న, సుషుప్తి, అవస్థలను దాటి స్థూల, సూక్ష్మ కారణ దేహములు మాయలోనే కలవని తలచి, దేహ భ్రాంతిని వదలి మహాకారణ దేహము పొంది తుర్య అవస్థ ఉన్మనీయావస్థలో ఆత్మ సుఖమును గ్రోలిన

బ్రహ్మరంధ్రము నుండి అమృత బిందువు చవిచూడడము జరుగుతుంది. అప్పుడే తన్మయానందము చెంది అమృత సుఖమును గ్రోలుదురు. అట్టి అమృత యోగి ఏ కర్మలు, ఏ ఇతర సుఖములు, ఇక అవసరము లేదు. ఈ స్థితినే అవినాశి పదమని అమృతానందమని, స్వయం ప్రకాశ తేజోరూపమని అంటారు. ఈ సుఖానందము గ్రోలిన వారు ప్రాణులు ప్రళయకాలములో చావరు (నశింపరు) సృష్టికాలములో జన్మించరు. దీనినే పరమపదమని అంటారు. (ఆపోజ్యోతి దర్శన మంటారు.)

ఆపోజ్యోతియే సర్వసాక్షియై గుర్తెరుగును. ఈ గుర్తే సర్వసాక్షీ నారాయణమూర్తి, సదాశివుడు, బ్రహ్మము, ఆపోజ్యోతి, ప్రత్యగాత్మ, ద్రష్ట. జ్ఞానము, ధ్యేయము, మహాలింగము, ముక్తి కాంత చెదరని దీపము. జ్ఞాన రత్నము, మోక్షము. నాదబిందు కూడిన కళా స్వరూపమే సహస్రారము. చిత్ సత్ లు కూడిన ఆనందమే సహస్రారము. గంగా, జమున, సరస్వతి, త్రివేణి సంగమము - సర్వమండలముల కాలయము. సర్వ పర్వములు తీరిన స్థానము సహస్రారము. ముక్తికాంత నివాసము కనుల నడుమ వెలుగొందే నిక్షేపమే. సహస్రారము, మోక్షము, జన్మరాహిత్యము మరియు హంసాతీతము, అహంవృత్తి రహితము, బంధరహితము. మహాజ్యోతి ప్రకాశమే. సర్వ సాక్షి. అర్యదర్శమున ఆపోజ్యోతి దర్శనమే మోక్షము.

ఈ బింబములే జ్ఞాననేత్రములు ఇవే సూర్యచంద్రుల కాధారభూతము. ఈ జ్యోతుల వలననే సర్వము గుర్తెరుగుదుము. ఆచార్యుల పూర్ణ కటాక్షము లేనిది ఎంతటి వారును, ఈ ఆపో జ్యోతుల దర్శింపలేరు. సద్గురు దయచేతనే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర్య, భయములు ఇక నిలువకుండా పారిపోవును. ఎంతటి వారికైన ఈ జ్ఞాన జ్యోతులు కనిపించవు. నారాయణమూర్తి శ్రీ కృష్ణ భగవానుడు. సద్గురు మూర్తి ఆపోజ్యోతి స్వరూపమే, మహాలింగము, సర్వసాక్షి స్వరూపులు. ఈ స్వరూపమే. మహాతేజమే, మహాతేజమే నిశ్కళా. నిశ్కళయే తాను. తానే పరమాత్మ. మహా తేజమే యోగము. జ్ఞానమిదే, లక్ష్యార్థమిదే, ఇదే జీవేశ్వర ఐక్యము. ఇదే వేదాంతము. మహాతత్వము. ఇదే ధియోః యోనిః పరమ రహస్యమిదే యని మీకు అందించు అమృత వచనములు విని ఆనందించండి.

హే, భక్తజనములారా! చివరిపారిగ, పరమ పదపరిచయము శ్రీ శబరీ-మాతాజి చరణధూళిచే. దివ్య పరమ పదముయొక్క నిజ స్వరూపము మీకు అందించుచున్నాను. విని ఆనందించండి. పరమ పదమే నిజస్వరూపము చిదంతి నామరూపాతి చిదంటి భువన త్రయ అని యున్నది. కావున నామ రూపములు గల

సమస్త ప్రాణులు త్రిభువనములన్నీ నశించును గాని పరమ పదము నశింపదు. చేతన, అచేతన వస్తువులు సర్వ పదార్థములన్నీ పరిసమాప్తమవక తప్పదు. ఇది సహజము ఇందులో ఎలాంటి సంశయము లేదు. కాబట్టి అజ్ఞానము, సుజ్ఞానమునందు, సుజ్ఞానము, నాదమునందు, నాదము, పరమ హంసయందు, పరమహంస, సర్వసాక్షియందు, సర్వసాక్షి, పరిపూర్ణము నందు లయించును.

నిజగురువాక్య మొక్కటే, సత్యము, నిత్యము. ఇదే పరమ పదము, గురుకటాక్షమే భ్రాంతి రహితము ఏమియు చేయనిది, ఏమియు లేని పరమ పదమందు ప్రపంచమున్నదని భావించుట. యద్యారోపము భ్రాంతిః అచల పరిపూర్ణ బ్రహ్మమే పరమ పదము. ఇది అశరీర బ్రహ్మము, కేవలాత్మ, పరావాస దేవుడు. నిరాలంభము, నిర్వికారము, బట్టబయలు పరమ పదమే కాలమందును, స్త్రీ, పురుషులుగ ఉండి, మాయను పుట్టించలేదు. పుట్టింపబడను లేదు. సర్వకాల, సర్వావస్థల యందు ఏకరీతిగ ఉంటుంది. కార్యకారణములు లేని పరమపదము మాయను ఎట్లు పుట్టించే? భ్రాంతి చేతనే, భ్రమ చేతనే, పరిపూర్ణ బ్రహ్మమున, ప్రపంచముతో చేగాని, విచారము చేసినచో భ్రాంతి విడుచును. గురుదేవుల పూర్ణకృపా కటాక్షముచే, నిజస్వరూపము తెలుసుకొన్న వారికి భ్రాంతి లేదు మాయ కూడ లేదు. వేరొకటి ఇకలేనే లేదు. అంతా పరమ పదమే. మహా ప్రభువే పరమ పదము. సీతమ్మతల్లి భక్త మారుతికి శ్రీ రామచంద్ర ప్రభువు నిజస్వరుపము గూర్చి, ఇలా అంటుంది. హే, అంజనేయ, సచ్చితానందుడు త్రికాల బాధలు లేనివాడు, అశరీరుడు. జ్ఞానము, ఆనందము, రాముని సత్యరూపము, దేవత్వము, ఉపాధి, ధర్మములు, గుణములు లేనివాడు తనసత్తాచే, సర్వంలో నిండి, వ్యాపింపబడినవాడు. ఏద్వైతే, సర్వంబ్రహ్మం ఇదే రాముని స్వరూపము, పూర్ణశాంతి రూపుడు, సర్వప్రేరకుడు. దేనికి, శోకింపడు, ఏ వస్తువు పై అపేక్ష లేనివాడు, ఏమియు చేయుడు, కేవలం ఆనందరూపుడు. రూపము తగ్గదు. పెరుగదు. తరుగదు. ఏకరీతిగ, తారుమారు కాని రూపము, బంధనివృత్తి చేయునది. స్త్రీ, పురుష, నపుంసక, నలుపు, ఎరుపు, వర్ణములు లేనిది. నడువడు, నిలువడు, దేనికి, శోకింపడు. ఎండకు ఎండని, నీళ్ళకు తడువని, మునుగని రూపము, చలికి, ఉలికి పడని, కత్తికి తెగని. ఏ శస్త్రముచేత, ఛేదింపబడదు. దేనికి పగులదు. అగ్నికి కాలని, ఎవ్వరు దొంగిలించని, రూపము, ప్రళయకాలములో చావదు. చేతుల కందనిది. మనస్సుకు గోచరించనిది. బుద్ధికి, అంతు పట్టనిది. కోమలమై, విశ్వవిశాలమై, నిర్వికల్పమై, జ్యోతి రూపము, సర్వజ్ఞము, సర్వాత్మకము, జగజ్జీవనము, విశ్వంభరము, జగదాత్మ, సర్వవ్యాపకమై సర్వ, పరిపూర్ణమై యున్నాడు. రాముడు, నిత్యసచ్చితానందుడై నిర్మలమై, స్వయం

ప్రకాశుడై యున్న రూపమే. రాముని రూపము యుగయుగముల పర్యంతము యోచించినను అంతు పట్టనిదై యున్నది. ఎవ్వరి యుక్తికి చిక్కనిది, ఏ శక్తికి బలికానిది. రూపమే పరమ పదమని సీతమ్మ తల్లి. భక్త మారుతితో అంటుంది.

అత్యద్భుత, ఆదిశక్తి, దివ్యశక్తి, శివశక్తి, విష్ణుశక్తి, బ్రహ్మశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, సర్వశక్తి, సర్వసత్తా సంపన్నమై యున్నదీ పరమ పదము. గురు సందేశమై గురు మంత్రమై, అద్భుత శక్తియై, భవబంధనాశిని. భయనాశిని. సర్వకర్మనాశిని, సమస్త శత్రునాశిని, పరమ పవిత్రమై యున్నది. కోటి సూర్యకాంతులతో కోటి చంద్రుల కాంతితో, కోటి విద్యుత్ తేజ పుంజములు కలిగి అఖండ, అపూర్వ, స్వయం ప్రకాశమై, వెలుగొందు, అవినాశీ రూపమైయున్నదీ పరమ పదము.

కేవలము ఎలాంటి ఆవరణలేని, అద్వితీయమై, నిరామయమై, సనాతన, ధర్మరూపమై, ఏకమై, విజ్ఞానయుక్తమై, అనంతమై, అచల పరిపూర్ణ, నిర్వికార, నిరీశ్వర, నిరాకారమై, అఖండ, అద్వైత, నిర్వికల్పి, నిర్గుణ, నిరాలంభ, సదోదిత, నిత్యనిరాలంబ, పరిపూర్ణమైన, పరబ్రహ్మమే, పరమ పదము. సద్గురుయే, గురుమంత్రమే, వేద, ఉపనిషత్‌ల, సారమై, ప్రకృతి ద్వయ, దోషరహితమై, శుద్ధమై వెలయు, కేవలానంద, సత్యానందమై, సదానందమై, పరిపూర్ణ బ్రహ్మనంద, శాశ్వత సుఖ, సంతోషములనిచ్చు, అమృత రూపమై యున్నదీ పరమ పదము. సద్గురు అఖండ, దివ్యసాక్షాత్ కారమే, పరమ పదము.

# స్వయం ప్రకాశ అవినాశి అమృతరూప ప్రవచనము యొక్క మహాత్మ్యము

బ్రహ్మాండమైన, పరమ విశిష్టమైన అద్వితీయ అమృత రస భరిత ప్రవచనమును మహాత్మ్యమును తప్పక చదివినను, విన్నను, వ్రాసిన గాని అద్భుత ఫలమిచ్చును.

అత్యద్భుతమైన, ఆదిశక్తి, దివ్యశక్తి, శివశక్తి, విష్ణుశక్తి, బ్రహ్మశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, సర్వశక్తి సంపన్నమై యున్నది. గురు సందేశమై, గురుశక్తి, వేద ఉపనిషత్ సారాంశమై యున్నది. భవబంధ నాశిని, భయనాశిని, ప్రసిద్ధ కీర్తి నిచ్చునది.

చాల ఉత్కృష్టమై యున్నది. పరమ పావనమైనది. సమస్త భువన, ఖాండములలో శ్రేష్ఠమైనది. సర్వశత్రునాశిని. అపూర్వ అఖండ, స్వయం ప్రకాశమై వెలుగొందుచుండును. అవినాశీ రూప అమృత రూపిణి, మహాయోగులకు, పుణ్యపురుషులకు పరమ భక్తులకు శ్రవణానందమై, మహానంద భరితమై, కేవలానందమై, పరమానందమై, నిత్యానందము కల్గించునది. సత్యానందమై, సదానంద, పరిపూర్ణానంద, బ్రహ్మానందమై, సర్వానంద సుఖ సంతోషముల నిచ్చునది. కోటి సూర్యుల కాంతి కలిగి, కోటి చంద్రుల శీతల కిరణములచే వ్యాపించి యుండి కోటి విద్యుత్ తేజ పుంజముచేత ప్రకాశము నిచ్చునదియు. శుభములు, మంగళములు కల్గించునది. కార్యసాధకులకు జయము కల్గించునది. కార్య సమర్థతయై, శుభప్రదమై, లాభదాయకమై, ధనధాన్య సర్వసంపదలను వృద్ధి పరుచునదియై యున్నది. ఇష్ట కామ్యముల పూర్ణము చేయునది. మన అనంత కోటి జన్మల సంచిత ప్రారబ్ధములను, పాపరాశిని, భస్మీపటలము చేయునది. జన్మ పావని, మహా జ్ఞానమును కల్గించి, జన్మ రాహిత్యము కలుగజేయునదియై యున్నది. ఇంతటి అద్భుత మహాత్మ్యమై యున్నది.

శ్రీ గణేశాయనమః శ్రీ వాణీదేవి వేదపాఠి సరస్వతీ మాత్రే నమః
శ్రీమన్ మహా విష్ణు పరమాత్మా పరబ్రహ్మణే నమః శ్రీ శబరి మాత్రేనమః

ఓం శాంతి శాంతి శాంతి
ఓం తత్, సత్ ఈ రచన
శ్రీ డి.కె.రావు గారు

: : - : :